# మారుతీ సందర్శనము

రచన

కవికులాలంకార, కవిరాజు

**శ్రీఅలంకారం కోటంరాజు**

ప్రకాశకులు:

**అలంకారం సోదరులు**

గాయత్రి నగర్, కందుకూరు, ప్రకాశం జిల్లా

శ్రీనివాసనగర్, ప్రొద్దుటూరు, కడపజిల్లా

# మారుతీ సందర్శనము

-శ్రీ అలంకారం కోటంరాజు

ఉ. భూతములట్లు నల్లడల భూరి కృపాణములన్ ధరించి, దృ
గ్ఘాత మహాగ్నులుప్పతిలగా, పెనుపొందెడి రాక్షసాంగనా
వ్రాతము, మధ్య చిక్కువడి, వందురు దానిని, దు:ఖితాత్ముడై
సీతను జూచె మారుతి నిశీథము నందు నశోకవాటికన్ --1

ఉ. ఈతనువేల, నీజనన మేల, నిసీయని వెచ్చనూర్పు, దు
ర్ఘాతులు, రాక్షసాంగల, రాయిడికిన్, తలయొగ్గి, గుండెలో
లోతుల పొంగు దు:ఖము, గడుంగడు గొంతుకడిగ్గ ద్రావు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --2

ఉ. వేతునటంచు పైకుఱకు, వెంగలి రావణఖడ్గ ధారకున్
కోతుమటంచు పైకుఱకు, క్రూరముఖోగ్ర కరాళ దంష్ట్రికా
వ్రాతముతోడ బొల్పెసగు రాక్షస కాంతల ధాటి కోర్చు, యా
సీతను జూచె మారుతి నిశీథమునందు నశోక వాటికన్ --3

ఉ. శ్రీతరుణేందుశేఖరు, చిన్మయ రూపుడు, పార్వతీ సతీ
నేత, త్రిలోక పూజ్యుడు, త్రినేత్రుడు ధర్మ నిబద్ధ బుద్ధి, నా
యీతలరాత నాపగ, నహీనగతిన్ జనుదేరడేల, యన్
సీతను జూచె మారుతి నిశీథము నందు నశోకవాటికన్ --4

ఉ. పూతమెఱుంగు పట్టుపరుపుల్ పయినిచ్చలు పవ్వళింతు, సా
కేతము నందు సౌఖ్యముగ, కీల్గడ పూవులు వాడకుండ, నా
కీ తరువే నివాసముగ, నిప్పటి కిట్లయెనంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --5

ఉ. దూతలు లేరు నాకెవరు, దుర్భరమైన మదీయ వేదనల్
భూతలనాథు రామునకు, పొందిక యేర్పడ జెప్ప, నెవ్వరీ
చేతకు వచ్చువారు, యలశ్రీహరి దక్క యటంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --6

ఉ. రోతురె? నాదు పోకకు, స్వరూప స్వరూప మెఱుంగ గోరి, యా
భ్రాతలు రామలక్ష్మణులు, భాస్కర వంశ వివర్ధనుల్, సురా
రాతిని మట్టుబెట్టుదురె? రాజిత చాపులటంచు యెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --7

ఉ. రాతిరియున్, బవల్, కనులరావెరచున్ అదియేమొ నిద్ర, నే
నీతల, రాముడాతలను, నిద్దురకున్ గడుదూరమైతి, మీ
రాతలు యమారుటెట్లని, నిరంతరచింతన, జేయుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --8

ఉ. ధాత యిదేమి? యిట్లనుచితంబొనరిచెను, రామమూర్తిన్
నాతివియోగ కల్పన, మనన్న గతిన్ సృజియించి, కానన
వ్రాతము నంచరింప, తలవ్రాసెనటంచని, యెంచునట్టి, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --9

ఉ. కాతరనంచు, నీయసురకాని తలంపున నుండెనేమొ, భూ
జాత, నయోనిజన్ రుచిర సద్గుణజాలను, జంకెఱుంగ, న
న్నీ తృణ ప్రాయు, డీతడొనరించునదేమని, యెంచునట్టి, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --10

ఉ. వాత విధూతమై యెగయు, వార్ధితరంగము లెట్లుదాటి, లం
కాతటి జేరు నట్టి దరిగానరు, గారని, రావణుండు, స్త్రీ
జాతిని దెచ్చుచుండెగద ! సాగవుయింకివియంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --11

ఉ. భీతుడితండు, రామపృథివీపతి, లేని తఱిన్, ననున్, మహా
చాతురి తోడ దెచ్చె పృథుచాపియు, గోపియు, రాఘవుండు తా
నీ తని ద్రెంచు, యుద్ధము, నిక్కమటంచని, యెంచునట్టి, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --12

ఉ. పోతర మావభించి, కసిపోవక పట్టెను, నన్ను పాపియై
ఈతడు, శాతమార్గణ యహీన, మహాగ్నిని, భస్మమౌను, సం
ప్రీతివహించు, జీవులు, ధరిత్రి రహించని యెంచు నట్టి, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --13

ఉ. జీతములేని కొల్వుయిది, జీవితమంత, యశోక వృక్ష సం
గాతముతోడ, తోటకిక కావలి గాయుటనొండె, లేక యీ
పూత చరిత్రమిట్టులె, సమూలముగా, హరియించు టొండె యన్
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --14

ఉ. నీతులు జెప్పవచ్చు, నెఱనీటులు గుల్కగ బల్క వచ్చు, ధా
త్రీతలమందు, సౌఖ్యము రహించెడి వారలు, యష్టకష్ట సం
జాత ప్రభూత, నీధరణీ జాతకదెట్లగు నంచు, యెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --15

ఉ. శీతములేదు, యుష్ణమును చింతన సుంతయులేదు, రామ భూ
నేత పదార యవిందములనే, మదినిల్పుట దక్కనాకు, ధా
త్రీతలమందు కోర్కెకలదే, యని యెంచు చునున్న యట్టి, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --16

ఉ. ఏతరళాక్షికిన్, ధరణి యిట్టిది, యెన్నడు కల్ల గూడ, దీ
పాతక మెట్టు, నన్నిటుల పట్టెను, శ్రీరఘు రామమూర్తి, కీ
కైతవ మొప్పునే? యనుచు, కన్నుల నీరిడి గూరుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --17

ఉ. తాతలనటి నుండి, చరితార్థతనొందిన, రాజవంశమం
దీ, తరుణాబ్జనేత్రుడు, సుధీత్వవిభుత్వ విశారదుండు, ధా
త్రీతల మందు, రాముడుదయించిటులయ్యెనటంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --18

ఉ. ఈతని, రావణున్ దునిమి, యీచెఱ నెప్పుడు బాపు నాకు, రా
గాతురుడౌచువీడు, మరుకాండ మహాగ్నికి నొచ్చియుండె, నా
కీతఱి నేమియౌనొ? యని యెంతయొ, చింతిలుచున్న యట్టి, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --19

ఉ. లేతయొనర్తురేమొకొ! మలీమసచిత్తులు, వింత చూడ్కులన్
చూతురొ! రాక్షసాధముడు, చోద్యముగా, ననుబట్టితేగ, నా
యీతలయెత్తలేక, యరియింతునె? యియ్యెల యంచు నెంచు, అవ
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --20

ఉ. భ్రాతృ పదారవిందములు, సాయక సేవలు జేయువాడు, ష
ణ్మాతురు వంటి వాడు, మనమందున భక్తిగలట్టివాడు, శో
కాతురుడయ్యె, నామరది, యంచును, లక్ష్మణునెంచు నట్టి, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --21

ఉ. ఈతరణీశ వంశమున, యిట్టిది యెన్నడు పుట్టలేదు, దు
ర్వాతి, నరాశనుండు, జలజాక్షుని, యివ్విధి మోసపుచ్చి, మో
హాతురుడౌచు దెచ్చెనను, యాత్మ వినాశకుడంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --22

ఉ. హేతుదేదిఒయ్యైనను, యహీన బలుండగువాడు, యిట్టి యీ
చేత "ససేమిరా" యనుచు, చేయడు, హేయమటంచు బల్కు, కా
మాతురుడైన రావణు, యమానుష కృత్య, మటంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --23

ఉ. సాతకుడైన, యాయసుర పాలకుడేలొకొనన్ను దెచ్చి, న
న్నాతతమిట్లు, మర్మములనంటెడు, యీటెలబోని మాటలన్
చేతల, నొవ్వ నాడుట, యిసీ! యిది యేమని, చింతనొందు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --24

ఉ. నాతని, సాధుశీలను, గుణాఢ్యను, ధర్మపథానువర్తినిన్
నీతిగలట్టిదాన, రజనీచరుడొక్కడు బల్మి బట్టు, నా
భీతనిమాన్పి, బ్రోవగల వేల్పులు, లేరని వంతనొందు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --25

ఉ. ప్రీతిదలిర్పనన్నిచట, పిల్చెడి వారును గూడలేరు, కా
మాతురుడైన, రాక్షసుని, మాటకునైపడియుంటి నేను, యీ
యాతన దీరుటెన్నడని, యాత్మను పెన్దురపిల్లుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --26

ఉ. లోతునెఱుంగ లేక, పెనులోభముపైకొన, మాయలేడికై
చేతులు మోడ్చి వేడితిని, శ్రీరఘురాముని, ముద్దు దీర్చ, భూ
నేతగమింప, జీవనవనిన్ కలగుండ యెంచు, నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --27

ఉ. ప్రోతురు, దు:ఖవ్ధాబడిపోవయెడివారి, దయాసముద్రులై
కాతురు, సజ్జనాళిని, ప్రగాఢముదంబున, కుదు వేళలన్
నాతుల వచ్చిగాయు, నరనాయకుకైకడువేచియున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --28

ఉ. ఈతరువేగదా! సదనమీమనుజాసనకాంతలెల్లరున్
కాతురు నన్నొ, , రేబవలు కంటికి రెప్పల యటుల్ వోలె, నా
కీ తరుణంబువంటిదిక, యిద్ధర రాదని యెంచుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --20

ఉ. మ్రోతలు, గర్జనల్, భయద, భూరి తరోజ్జ్వల, నిస్వనావళుల్
భీతిని గొల్పునట్టి, కడుభీకరమౌ, వికటాట్ట హాసముల్
ఏతరళాక్షియోప్పునివి, యొంచగ నంచు, సహించుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --30

ఉ. పాతికపాలు లేడికయి, భామలనైజముగాన, కోరితిన్
ఆతరువాత లక్ష్మణుడు, యంజలి పట్టి వచించినాడు, నీ
వాతని మాట ద్రోసితివి, యంబుజనాభ! యటంచునెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --31

ఉ. ఏ తలిరాకు సవ్వడికొ! యీవనిలోనిద్విజాళి మ్రోతకో!
నాతలపందు నాథుని, గుణధ్వని, విన్న తెఱంగుదోచు, నా
యీతలపెప్ప నిక్కమయి, యీ చెఱబాయు నటంచునెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --32

ఉ. "పూతచరిత్ర సీత-- యను పొల్పునుగంటిని, దివ్యధాత్రి సం
భూతగ పేరుగొంటి, నిటు, భూరిగుణాళికి, నిక్కనైతి, నా
పాతక మేమొ! రావణుని, వాతను జిక్కితి, నంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --33

ఉ. ఏతరమందు నిట్టిది ధరిత్రిని గల్గదు, కల్గినట్లు, ధా
త్రీతలమందు పెద్దలు మఱెవ్వరు దెల్ప వినంగలేదు, యే
నాతియు, నిట్టి బాధల, కనంగనులేదని, యెంచునట్టి, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --34

ఉ. హేతువదెట్టిదైనను, సహింపగరానిది, యిద్ది, రాముడే!
శాతముఖోగ్రనారస ప్రసార ప్రభంజన వీచి, దూసి, భూ
జాతను, నన్నుగావ, పపుజన్ముని తో, నరుదెంచు వేడ్క, యన్
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --35

ఉ. కేతువొ! రాహువో! యనిన, కీటకరూపుడు, వీడు, నాడు వి
ఖ్యాత, మహామునీశ్వరునిగా, జనుదేరెను, పర్ణశాల, నే
నీతని, గారవించితిని, యింతలు పుట్టెను, యంచునెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --36

ఉ. జాతియు, వంశ గౌరవము, సభ్యత, యించుకగూడ, యీ సురా
రాతి దలంపబోగు, కడురాతి, యెడందగదా! జగంబులన్
ఈతని క్రూర కృత్యముల, కిట్టుటు, లయ్యెనటంచు, నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --37

ఉ. లాతులబోవునా? యితడు, రావలె, రాముడు, లక్ష్మణుండు, యు
గ్రాతప మూర్తులై, యరిని, కాండ చయంబుల గ్రుమ్మగావలెన్
ఆతడు యప్పుడే! యముని యంతికముండు, నటంచునెంచు, చా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --38

ఉ. మాతనటంచు, నన్నుకడు, మన్నన జేసెడి, లక్ష్మణుండు, తా
నే, తలిరాకు జొంపముల, నెమ్మెయినుండెని, మన్నతోడుగా,
ఆతడె వచ్చినన్, యసుర యాయువుదీయడె? యంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --39

ఉ. నాతనువందు ప్రత్యణువు, కాథుని గూర్చియె, చింతసేయు, కా
మాతురుడైన, యీతడు, దురాగత మెద్ది యొనర్చునేమొ? భూ
నేత, యెఱుంగునప్పటికి, నేనిట యుందునె, యంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --40

ఉ. ఆతని భార్యలున్, ప్రజలు, ఆతని బంధులు, జెప్పరేమొ? యీ
పాతకముల్, యకృత్యములు, పాయు మటంచును, బ్రహ్మ వంశ మం
దీ, తెఱగొప్పునే? యనెడి, ధీయుతులెవ్వరటంచునెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --41

ఉ. ఈతను వింతలింతలుగ, యిమ్మెయి పోవక యేల నిల్చెనో!
కైతవ మిద్ది యంచు, తను కాంతియుజూచి, గ్రహింపనైతి, భూ
నేతను, మాయలేడి కయి, నెమ్మి నిబంపితి యంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --42

ఉ. రీతులు, వృత్తముల్, రిపుల యొత్తుగడల్, యొఋగంగలేక, స్త్రీ
జాతి, వివేక హీనత, ప్రజాళిని, పల్పనగారె? ధాత్రినా
రీతిగనేను, యిట్ల యితి, నెందుకు, యీవగపంచునెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీధము నందు నశోక వాటికన్ --43

ఉ. ఈతలిరాకు సెజ్జనిట నేరు రచింతురు, లక్ష్మణుండు లే
కాతడు, నాకు రామునకు, నంచిత రీతి యొనర్చువాడు, లో
లోతుల పిండి, గుండియ, కలుక్కుమనన్, యది యెన్నుచుండు నా
సీతను జూచె, మారుతి, నిశీధము నందు నశోక వాటికన్ --44

ఉ. ఆతనరారు, కాననము, లాసెలయేరులు, నా మృగాళి యున్
ఆతపసుల్, మనోజ్ఞమగు, నాగిరు,లాతరు,లా ప్రదేశముల్
నాతల పందు, వీడవని, నాకవి యబ్బునె? యంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీధము నందు నశోక వాటికన్ --45

ఉ. ఓ తరుణాబ్జ చారురుచిరోన్నత ప్రోన్నత దివ్య నేత్ర, రా
వే! తపనీయగాత్ర! యని వేడ్క కరాబ్జము బట్టి, కానన
వ్రాత, మనోజ్ఞ దృశ్యముల, రమ్యత నెన్నెడి స్వామి యంచు, నా
సీతను జూచె, మారుతి, నిశీధము నందు నశోక వాటికన్ --46

ఉ. వ్రాతురు, నా చరిత్ర, తనరన్, విధి వంచితనైన దాన, ఇం
కే, తలరాతకుబోడి, ధర యిట్టి వికిరము జేయ బోదు, వి
ఖ్యాత కవీశ్వరుల్, యలరు కావ్యములల్లుదు, రంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీధము నందు నశోక వాటికన్ --47

ఉ. నేతగనా? మనోహరుడు నీరజ నేత్రుడు, రామమూర్తి కిన్
నేతగనా? యభాగ్యను, మనీషిని, రాఘవు బాధ పెట్టి తిన్
నేతగుదున్, మనోజ్ఞ రజనీశముఖిన్, యని యెంచుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీధము నందు నశోక వాటికన్ --48

ఉ. ఏ తగదంచు నెంచితిని, శ్రీరఘు రాము పదాబ్జ సేవకున్
ఏ తగనంచు నెంచితిని, శ్రీరఘు వీరుని పాద సేవకున్
ఈతగవున్, మనంబునను, యెంచుచు, దీనత నున్న యట్టి, యా
సీతను జూచె, మారుతి, నిశీధము నందు నశోక వాటికన్ --49

ఉ. ప్రీతి యొనర్పగాను, యరవింద దళాక్షుడు, యేగె లేడికై
నేతెగుదారినై, వినక, నిర్మలు, లక్ష్మణుబల్కి నంపితిన్
యీతల లేని చేతకు, భరించుచునుంటిని, యంచునెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీధము నందు నశోక వాటికన్ --50

ఉ. సైతునె? యెన్ని నాళ్ళిటుల, సారస నేత్రుని, జూడకుండగన్
నేతనియంగ లేనిచట, నీరజనేత్రుని, జూడకుండగన్
నాతల పెప్పుడో, నిలిచె, నాధునిపై, ఘనమై, యటంచు, నా
సీతను జూచె, మారుతి, నిశీధము నందు నశోక వాటికన్ --51

ఉ. లాతివిధానగాన, రఘు రాముని మూర్తిని, రావణుండు, యీ
చేత ఘటింప నాకొదవె, శ్రీరఘురాముని దివ్య మూర్తి, యా
హా! తనరారె! నాజనుషయంచును, యాత్మదలంచుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీధము నందు నశోక వాటికన్ --52

ఉ. రాతిని నాతి జేసె, రఘు రాముడు నాడు, మహాత్ముడి ప్పు, యీ
నాతిని రాతి జేసెను, సనాతనుడాతడు, రావణా సురా !
నీతల వ్రీలు టెన్నడు, యనిన్, యని యెంచెడి, క్రోధ మానసన్
సీతను జూచె, మారుతి, నిశీధము నందు నశోక వాటికన్ --53

ఉ. జాతికి వన్నె వాసి యు, ప్రజాళికి రక్షణ, మౌని కోటి పె
న్నూత, సమిద్ధ యజ్ఞ తతి, కుజ్జ్వలతన్ ఘటియించి, యుర్వి స్త్రీ
జాతికి, గర్వమై యెసగ, సాకెడు, రాముడటంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీధము నందు నశోక వాటికన్ --54

ఉ. ఏతపమో! వ్రతంబొ! శ్రమియించి, యెనర్చిన, కారణాన, నా
కీ తరమందు, రామునకు, యింపగు భార్యను నైతి, యుర్వి వి
ఖ్యాతిని గొంటి, రావణుని, కారణ మిట్టయితంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీధము నందు నశోక వాటికన్ --55

ఉ. భూతల మందు రావణుని పోడిమి తగ్గునుగాక, యింక స్త్రీ
జాతికి మానరక్షణము, సారయశుండగు రామమూర్తి చే
నాతత మొప్పు గాత! యని యాత్మను చింతన జేయుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీధము నందు నశోక వాటికన్ --56



ఉ. ప్రేతము వోలె రావణుడు, రేయిబవల్, విడకుండ, యీవనిన్
ప్రీతి గలట్టి వాటివలె, పేర్మి మెయిన్, నటియింప నాకు, యీ
రోత భరింప జాలను, నరోత్తమ, రమ్మని వేడు నట్టి, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --57

ఉ. ఆతురజెందనేల యని, యారఘు నేత, మనోజ్ఞ రూప, మీ
నాతలపంతనింపితిని, నావలవంతయు, మీదు బెట్టితిన్
ఆతడదేల రాదొ! నను నాదు కొనంగని, చింతజేయు, నా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --58

ఉ. రాతలు! వ్రాయు వాడజుడు, రాక్షస జాతికి మేలొనర్చు, యా
వ్రతఫలంబదేమి? యమరారులకున్, సుఖజీవనంబ, యే
లీ, తలవ్రాతలంచును, సహించని, దుర్వ్యథనొందుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --59

ఉ. శీతల వాయువుల్ సరకుసేయదు, రాక్షస స్త్రీల మాటలన్
రోతయటంచు మెచ్చదు, చురోజభరంబున, మేనువంచి, రా
మా! తడవాయెరా! యనుచు, మాటికి మాటికి పిల్చునట్టి, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --60

ఉ. పాతకి చుప్పనాతి, మరుబారికి నగ్గము నొచు వచ్చి, కామాతుర యౌచు, కా
మాతుర యౌచు, స్త్రీ సహజమౌ, నునుసిగ్గును వీడు నాడె, నా
జాతక మందు మల్పొకటి, సంభవమయ్యె, నటంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --61

ఉ. ప్రోతురటంచు, ధైర్యమది పొంపిరి వోవగవేడబోను, సా
కేతపురాధి నాథుని సఖిన్, గతి మాలగ నేల దీన నై
యాతడె వచ్చు నంచు, తన యాత్మగతంబున, నిశ్చయించు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --62

ఉ. పాతరబోసినాడు, పలుపాతకముల్, వెసప్రోగుజేసి, కా
మాతురుడౌచు వీడు, కడు మాన్యత గాంచిన, వంశగౌరవం
బీతడు వమ్ము జేసె, యెవరీతని, గాతు రటంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --63

ఉ. నా తరువాత యెందరొకొ! నాకును ముందుగ నెందరైరొ! యీ
నాతుల, పాతకంబిక, పునాది, గదల్చి సబాంధవంబుగా
పాతర బెట్టు రావణ! కృపారహితాత్మక! యంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --64

ఉ. నాతుల నేచు పాతకి, తృణంబున బోవునె పాపమింత, నీ
జ్ఞాతుల, సంచలంచలగ, సాగుచు వచ్చెడి, రామబాణ, సం
జాత మహాగ్నికిన్, సురిసి, చత్తురటంచు, శపించుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --65

ఉ. చేతమదెన్నదో వెడలె, చేదొదవెన్ మది, యైహికమ్ములన్
కేతకు లేల? పైకముల గీతములేల? విరాగివోలె. ధ
ర్మేతర వృత్తికిన్, గినిసి, రేబవళుల్, తపియించుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --66

ఉ. లూత యితండు, పన్నెను గడుంగడు బెట్టిద మైన గూడు, నా
కీ, తెఱగింతయున్ తెలియకే పడితిన్ నొక లేడికోసమై
ఈతెలి విట్లు గాలినది, యింతగ, నంచిద, చింత నొందు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --67

ఉ. మేతలకేగివచ్చి, తమ మేనుల ప్రేమగ రాయు, యండజ
వ్రాతము వేడ్కగన్న, మదిభాస్వదమౌ, వలపెంత యెంత, దా
హా! తెలిసెన్, వియోగమున, నంచును, రాముని, సంస్మరించు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --68

ఉ. ద్యోకత మయ్యె, నీయసుర, దుష్టపు భావన, రామబాణ సం
జాత, మహాగ్ని భీతిగొని, స్వామిని, రాముని, మభ్య పెట్టి, న
న్నీతడు, దెచ్చె లంకకు, ధరిత్రిని, జూడ నటంచునెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --69

ఉ. భూతరుణీమణీసుతను, భూరి పరాక్రము, రాము పత్నినై
ఈతెగు దారి చేతబడి, యిమ్మెయి బాధల నొందుచుంటి, యిం
కే తరళాక్షి, యోపతగ దీవవెతయంచును యెంచు నట్టి, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --70



ఉ. ఈతలరాతకు బాకునకు నెంతటి వాడి ! యెరుంగరాదు, యీ
పాతకి, రావణుండు తన పంతము నెగ్గగ, మన్మథుండు డా
చేతను కర్దమున్ గడిపి శ్రీహరి యుంచెనటంచు, నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --71

ఉ. మాతట! కైకసీసతి, సమంచితవర్తన, యట్టి దానికిన్
ఈతలగొయ్యి యెట్లులుదయించెనొ ! వంచన పాడుగాను, సా
కేతపురీవరుండనగ, కేవలుడే యని యిచ్చ మెచ్చు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --72

ఉ. కాతనరా? సనాతనను, కాంతికి యిక్కను, వంశ గౌరవం
బీ తరమందు నిల్పుటకు, నిద్ధర ధాత్రి వధూటి గర్భ సం
జాతను, నన్ను రావణుడు చావగ దెచ్చెనటంచు బల్కు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --73

ఉ. సేతురు రామలక్ష్మణులు, సేగి యొనర్చిన వారికిన్, సురా
రాతికి, లంక ఘూక ప్రకరంబులకిక్కయి భీతిగొల్ప, యు
గ్రాతప మూర్తులై, సుజన కాండము మెచ్చ యటంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --74

ఉ. భూతములుల్లసిల్లు, పరిభూత మనస్కులు దేవతాళి, యీ
ప్రేత మదృశ్యమై చనగ, ప్రీతి దలిర్తురు, నాదు కారణం
బీతని, వీనిలంకను, పొరింగొను నంచని యెంచుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --75

ఉ. ప్రాతదనంబు పై కొనిన భామల, పోవిడనాడి వీడు, మో
హాతురుడౌచు, క్రొత్తలగు యబ్జముఖుల్ గనినంత చాలు, సం
జాత మనోజు రాగమున, చక్కగ దెచ్చునటంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --76

ఉ. నీతియొకింతలేదు, నవనీతముగాదు మనంబు, వానిదౌ
చేతము లోక కంటక, మజేయము, బ్రహ్మవరప్రభావ యు
ద్భూత మహాత్త గర్వము, నభూతము వీని కటంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --77

ఉ. నాతనువెంత ధన్యమయె, నాతిగ రూపొనరించి నన్ను, యీ
పాతకుగీటడంపగ, ప్రపంచము హర్షము నొంద, దేవతా
రాతిప్రపీడనాభరమడంపగ నంచని యెంచుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --78

ఉ. రాతిదనంబు బూని, యిట రామునికై కడు తెన్నుగాచి, నే
నాతతమీ యశోకతరునందున నిల్చితి, దైవతారి వా
గ్ఘాత విభీషికల్ వినగ జాల నటంచును, యెంచుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --79

ఉ. తీతువు పిట్ట కూతలకు, తీవ్రత హెచ్చెను లోన, దీనతా
హేతువిదేమి, యిట్లగుట, హీనుడు రావణు దుష్టచేష్టలన్
ఈతర మిట్టె సాగునని, యంచుచు, చింతన సేయుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --80

ఉ. లేతమెఱుంగు చెక్కులివి, లేవిప్పుడట్టు, నిరంత బాష్పధా
రాతతి రాయిడిన్ బడి కరంగెను, దుర్దిన వేళ, వేడిచే,
ధాతనెదిర్చి నాబ్రతుకును ధాత్రిని నిల్పితి నంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --81

ఉ. భూతపతీ! వికుఠపురి భూషిత భూషణ! సత్యలోక వా
సా! తగవా! నరాశనుని, శౌర్యవిభూతిని రూపడంపరే!
నాతిని నన్ను గావరె! యనాదరమేల? యటంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --82

ఉ. నేతినలేదు, త్రాగుటకు నీరముగైకొనలేదు, దైవతా
రాతి, కరాళదంష్ట్రికల, రాయిడి బాయదలంతు, రామనీ
శీతశరాళి దక్క, నను సాకెడి దెయ్యది యంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --83

ఉ. కాతురు యెవ్వరేని యిల, కాంతల మ్రుచ్చిల, సర్వ దేవతా
వ్రాతములోన, ముందునొకరైన కనంగను జాలిరే? వృథా
యాతన యేలనంచు, తమ యాత్మదలంచిరె? యంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --84

ఉ. గౌతమి తీరమందునదె, గ్రాలెడి నట్టి కుటీరసీమ, ప్రా
భాతసమీరముల్ తరుల భాస్వదరాంతుల నిగ్గుదేలు, బా
లాతపరేఖలం గనగనయ్యెడు నెప్పుడటంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --85

ఉ. మూతయెఱుంగ నీ కనులు, మ్రుక్కడి మూకలు రాక్షసతఃపుం
జేతలు, రోతబుట్టినను, శ్రీరఘురామ! త్వదీయధ్యానమే
నాతనువందు, ప్రత్యణువు నాటె రహింపగ, నంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --86

ఉ. కూతలు యేవొకూయు, ననగేడని వంచును యెంచబోడు, నా
కాతని జూడ రోతగు, నహంకృతి వానికి మెండు, బాహు ద
ర్పాతిశయుండు వీడు, యినవంశ వివర్ధన యంచు బల్కు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --87

ఉ. ఏతరళాక్షికిన్, మిగుల హేయము నాసురపీడనమ్ము, నా
కేతలవాచె, నీశరముఖీన చణత్వము చేతగాని, నా
కీతలనొప్పి తగ్గదు, సఖిన్ కనరావె యటంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --88

ఉ. నేతలకున్ తలంపగను నేతవు, యిద్ధర రాజనీతికిన్
లాతుల మెచ్చుబోవు, సమరాంగణ మందున నీకు దక్క, యా
చాతురి యేరికిన్ గలుగు స్వామి, యటంచును రామునెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --89

ఉ. భూత ధరాత్రి యిద్ది, యను భూత చరాచర జీవరాశికిన్
యూతగ పొల్పుచుండు, నిదియుండిన యన్ని యునుండు దీనినే
యాతడుడింద జేయగ, నహంకృతి జూపెనటంచునెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --90

ఉ. ఊతగ నిల్చె వానికిని, యుర్విని బ్రహ్మ వరాలు, వాని చే
యూతడు గర్వితుండయి, దిగీశుల లక్కగొనండు, యిట్టి ధ
ర్మేతరు జంపి, పేరుగొను మేదిరి యంచని రాముబల్కు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --91

ఉ. దూతనుబంపుమా? యిట వధూటియు, కాటికి కాళ్లు జాపి, సా
కేతపురీ హరీ యనుచు, కేలు మొగుడ్చుచు వేడుచుండె, నీ
వీతని బారి నుండి, దరియింపగ జేయు మటంచు బల్కు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --92

ఉ. చూతు, నిరంతరంబు, కనుచూపునిగిడ్చి వగర్చి లంకలో
ఈతడి యారనట్టి కనులిట్టటు మూయక నిల్చి నేను, స్వా
మీ! తగదింక, యీబిగువు, మిన్నిదె, పైబడెనంచు వేడు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --93

ఉ. ఆతరులందు, నాగిరుల, నాబలు కోనల, యేటి పాయలన్
ఆతతమట్టులుంటిమి, నవాంబుదనీలశరీర నీవు లే
కీ, తలిరాకు బోడిని, దహించెను, దు:ఖమటంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --94

ఉ. ప్రోతువటంచు నిన్ను భువి పూజ్య మహర్షి గణంబు గూడ, నీ
కేతమ కేలుమోడ్చెదరు, యీనను బ్రోవగ చేయిరాద, నే
నీ తరళాక్షిగా, మదిగణింప వయంచని వేడుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --95

ఉ. రాతకులేదు మిక్కిలిల, రాదుగదావని, చాకురంగ, మ
బ్జాత మనోజ్ఞనేత్ర! యది భాస్వద కాంతులనీన బోదు, యీ
యాతననేభరింపవలె, నంచిటు వ్రాసెనటంచు యెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --96

ఉ. ఏతమమో, రహించి, కనులింతయు గన్పడరాక లేడికై
నేతపింయింప నీవయిన, నిక్కమ కాదని ద్రోచి నావె, నా
యీతతీ తీపుముప్పుగరహించెనటంచును యెంచుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --97

ఉ. ఈ తనువల్లి యీ పొగులు కెప్పుడొ వాడెనొ చావనొచు, ని
న్నీతలపందు, నిల్పుకొని, యిట్టుల ప్రాణముతోడ నుంటి, నా
యీతపమెన్ని నాళ్లోయని, యెంతొ వగన్ విలపించుచున్న, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --98

ఉ. చూతును కొన్ని నాళ్లిటుల, శోభితరమ్య వినీలదేహ! ధ
ర్మేతరగాను, భార్యను, సుమింపగనాతనువల్లి, నీవు, దు
ర్వాతి మహాసురున్, దునుమరమ్మని బల్కుచునున్న యట్టి, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --99

ఉ. లేతవస్సులో నిటు, నిలింప విరోధికి జిక్కి నేను, యీ
బ్రాతిగనుంట జూడ, తలవ్రాత యటంచును నెంచుచుందు, రా
వా! తలపింతలేద? సురవైరినిద్రుంపవ, యంచునెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --100

ఉ. నాతరువాత యిట్టి గతి, నాతుల కేరికి పట్టకుండ, నే
నా తరుణాబ్జ నేత్రునకు, నర్మిలి పేర్మిని జెప్పి, ధర్మ సం
జాతమనస్కులైప్రజలు సాగగ జూతు, నటంచు నెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --101

ఉ. శ్రీతనరారె! నెట్లసుర కీపుర మందున, వీని చేతకున్
ప్రేతకళా విలాసములు భీతిని గొల్పక, యష్టలక్ష్ములున్
ప్రీతిదలిర్ప నిల్చిరిట, యేమని తామన మందునెంచు, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --102

ఉ. ఈతని ప్రోలు మంటబడ, ఈతని మారిమసంగ, వీనిద
ర్పాతిశయంబుగాల, నిజరాడ్విభవంబుసుమింత బూదియై
వాత విధూతమై యెగసి, వార్ధిమునుంగ యటంచు నెంచ, యా
సీతను జూచె, మారుతి, నిశీథము నందు నశోక వాటికన్ --103

ఉ. ఆతతమున్ ప్రవృద్ధమగునంచిత భక్తిని యిచ్చి, సత్య ధ
ర్మేతర కృత్యముల్ దెసకునింతయు నామది పోవనీక, శో
భాతి శయంబుగాంచగను, భాస్కరవంశవివర్ధనా! ప్రభూ!
నేతగనా? నవాంబుదవినీలమనోజ్ఞప్రభా! ప్రభాకరా! --104

ఉ. శ్రీతరుణీమణీ వరలె సీతగ, శేషుడె లక్ష్మణుండుగా
భూత ధరిత్రి గావగను, పుట్టితి వీవసురావ్రాతమున్
శాతశరావళి ద్రుంపగను, సజ్జనులన్ పరిరక్షజేయ, సా
కేతపురీ విహారి! ఝషకేతనువైరినుతా! యశోధనా! --105

ఉ. నేతినువేళ, త్రావుటకు నెంచెడి వేళ, విహారవేళ, ని
న్నేతలపందు నిల్పుకొని, నెమ్మిచరింతును, రామ నీవు, నా
దాతవు, రక్షకుండవు, విధాన విధాతవు, దీక్షబూని నీ
శ్రీతరుణాబ్జ పాదముల, చెంతను జేరితి, కోరియియ్యెదన్ --106

ఉ. నాతనువున్ ప్రియంబున మనంబును, నీకయి మీదుబెట్టితిన్
నాతెఱగంతయున్ దెలిసి నాటక మీవి, టులాడ నేల? సా
కేతపురీనరేశ్వర! నృకేసరి వీర రసావతార! నీ
కేతగు రా! ధరాత్మజ పరిగ్రహ! ఈశ్వరచాపఖండనా! --107

ఉ. లాతులు లేనిచోట, నినులాలన జేసెడిచోట, జానకీ
చేతి మనోజ్ఞస్పర్శ, నినుజెందెడి చోట, మనంబు సుంతయున్
యేతగులంబు లేకనురహించెడిచోట, నవాబ్జ పత్రనే
త్రా! తలపందునన్ దలప, ధన్యతగాంచక నొందకుందునే? --108

ఉ. ఈతలిరాకు వంటిది, ధరాంగన ముద్దుకుమార్తె యైన, యా
సీత, యశోక వాటి తన చేటు దలంచి కలంక తోడ, యే
దో, తలపందు నిల్పెను, మదోద్ధరుడౌ దశకంఠు గూర్చి, యి
ట్లే తగునంచు వ్రాసితిని, యిద్ది విలోకనసేయుడింపుగన్ --109

ఉ. సీతయెగాదు, లోకమున సీతసమానులు, పూజ్యురాండ్రు, యే
పాతకు చేతజిక్కి, పలుబాములు నొందుచునున్నవారొ. నా
కీతలపందు నిద్ది, యురరీకృతదు:ఖము గల్గజేయు, యే
సీతకు గూడ, గూడదని, చింతన జేయుచు దీని వ్రాసితిన్ --110

ఉ. సీతమనస్సులో మనసు, చింతన సేయుతెఱంగెఱుంగ, నా
చే, తనరార నిట్లు, సురుచిత్వశుచిత్వ మహత్త్వమొప్ప, యా
రాతిరి, యీబవల్ యనక, రమ్యతరంబగు, కల్పనా ప్రభా
శ్రీతనుకొప్ప వ్రాయను జేసెను, శ్రీరఘు రాముడునన్నతిన్ --111

కం. సీతారాములు దయతో
సతంబు పఠియింపగాను, సజ్జనులురీన్
చేతోమోదముతో, మా
రుతీ! రచించితి, మరంద రుచులు వెలార్పన్ --112

ఇతిశివమ్

(16. 5. 1986 ఉదయం 11.00 గం//లకు పూర్తియైనది )